# పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి

ఏవిధంగా పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి ఏర్పడిందో, అట్లే పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి ఏర్పడింది. దీనికి దర్శేష్టి అని మరొక పేరు. ఏవిధంగా శుక్లపక్ష చంద్రుని వికాసంవలె పుత్రుల వికాసం ఉంటుందో, అట్లే కృష్ణపక్ష చంద్రుని హ్రాసం (క్షీణత) వలె పితరుల శరీరాలు దుర్బలములౌతాయి. కనుక ఆ సమయంలో పుత్రులు పితరుల సేవా శుశ్రూషలు చేసి పితృఋణం తీర్చుకోవాలి. లేకుంటే కృతఘ్నులౌతారు. పాపభాగులౌతారు. 'పున్నామ నరకం నుండి కాపాడేవాడే పుత్రు'డంటారు కదా! పున్నామ నరకం అంటే మరణానంతరం వెళ్ళే నరకం కాదు. వృద్ధావస్థనే పున్నామ నరకం అంటారు. ఆ స్థితిలో పితరులను ఆదరించి కాపాడుతూ ఉంటాడు కనుక పుత్రుడంటున్నారు. వయస్సు పెరిగేకొలది శరీరం శుష్కిస్తుంది. బలం ఉత్సాహం తగ్గిపోతూ ఉంటాయి. ఇంద్రియ శక్తులు క్షీణిస్తూ ఉంటాయి. కంటిచూపు, చెవి వినికిడి, నడక, చేతులలో పనితనం తగ్గిపోతూ ఉంటాయి. ఎముకలలో అరుగుదల వచ్చి మోకాళ్ళనొప్పులు, నడుంనొప్పులు, కీళ్ళనొప్పులు, నరాలనొప్పులు మొదలగునవి రావచ్చు. నేడు నవనాగరికత ప్రభావం వల్ల బి.పి., షుగర్, కొలెస్ట్రాల్, రక్తప్రసార లోపాలు, నరాల సమస్యలు చాలానే బాధిస్తున్నాయి. కనుక పుత్రులు వృద్ధుల శరీరాలకు తగిన పథ్యంగా భోజనం సమకూర్చిపెట్టాలి. ఆవిధంగా వృద్ధులకొరకు ప్రత్యేకంగా చేయబడిన ఆహారాన్ని వేదం 'స్వధా' అంటుంది. 'పితృభ్యః స్వధానమః' అనే వాక్యం యజుర్వేదంలో చాలా పర్యాయాలు వస్తుంది. పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు (తండ్రి, తాత, ముత్తాతలకు) కూడా సేవా శుశ్రూషలు చేయమంటుంది వేదం. నేడునూ కొందరు మునిమనుమల సేవలను అందుకుంటున్నారు కదా! ఇక్కడ పితరులంటే కేవలం తల్లితండ్రులనే కాదు, అమ్మమ్మలు, నానమ్మలు కూడా.

మన వేదశాస్త్రాలలో 'పితర' పదం విస్తృతమైన అర్థాలతో కనబడుతుంది. ఎందుచేతనంటే – ఈ పదం 'పా – రక్షణే' అనే ధాతువుతో నిర్మించబడుతుంది. కనుక మనను రక్షించేవారు, మన ఉన్నతికి పాటుపడినవారు అంతా మనకు పితరులే. అందుచేతనే ఆచార్య చాణక్యులవారు...

**శ్లో॥ జనితా చ + ఉపనేతా చ యస్తు విద్యాం ప్రయచ్ఛతి ।**
**అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః ॥**

తల్లిదండ్రులు, ఉపనయనం చేసి గురుకులానికి లేదా విద్యాలయాలకు పంపి చదివించినవారు, విద్యలు నేర్పిన గురువులు, ఆకలితో అలమటించకుండా అన్నం పెట్టి కాపాడినవారు, దుష్టులవల్ల భయం కలిగినప్పుడు అభయమిచ్చి కాపాడినవారు – ఈ ఐదు వర్గాలకు చెందినవారంతా పితరులే" నంటారు. ఇది వేదం చెప్పే విషయమే. పై శ్లోకంలో చాణక్యులవారు సరళంగా చెప్పారు. వీరినేకాక విద్యా విజ్ఞాన రంగాలలో కృషిచేసినవారిని, యోగసాధకులను, ధర్మోపదేశకులను, కళాకారులను, దేశంకోసం ధర్మంకోసం పాటుపడేవారినీ కూడా వేదం పితరులే నంటుంది. వీరందరిని గృహస్థులు ఆదరించి సత్కరించి వారినుండి ఉపదేశాలను, అనుభవాలను పొందమంటుంది. వీరిని శ్రద్ధతో సేవించటమే శ్రాద్ధమనీ, అనుకూలమైన ఆహారాలను ఇచ్చి తృప్తిపరచటమే తర్పణమనీ మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శ్రాద్ధ తర్పణాలు జీవించి ఉన్నవారికే కాని మృతులైనవారికి కాదు. ఆదిమ స్మృతికర్తయైన మనుమహర్షి గారు ఏమన్నారంటే –

**శ్లో॥ కుర్యా దహరహః శ్రాద్ధమ్ అన్నాద్యేన ఉదకేన వా ।**
**పయో మూల ఫలైర్వాఽపి పితృభ్యః ప్రీతిమావహన్ ॥** – మనుస్మృతి 3-82

"ప్రతిదినము పితరులను ఆహ్వానించి అన్న జలములతోను; పాలు, పండ్లు, శాకములతోను శ్రాద్ధము చెయ్యాలి" అన్నారు. ఇవన్నీ జీవించి ఉన్నపుడు మాత్రమే సాధ్యం. చనిపోయిన తరువాత ఎలా చెయ్యగలం? వారు ఎక్కడ ఉన్నారని వాటిని పంపగలం? ఈ పొరబాటును సరిచేసుకోకపోతే మనం నవ్వులపాలవుతాం. పై వారందరిని ఆహ్వానించి సత్కరిస్తే మనకేం మిగులుతుంది అని అనుకోవద్దు. యథాశక్తి చెయ్యవచ్చు. అటువంటి యోగ్యతగల పితరులు చాలా కొద్దిమందే ఉంటారు. వారు కూడా అందరు పెట్టినది తినలేరు కదా! "Give Respect to Senior Citizens

- Don't ignore their experiences" అనే నినాదాన్ని పాటించినా చాలు. ఆ ఉద్దేశ్యంతోనే ఋషులు అమావాస్యేష్టి సదాచారాన్ని ఏర్పాటు చేశారు. ఇక మనం అమావాస్యను గురించి ఆలోచిద్దాము.

అమావాస్యనాడు చంద్రుడు మనకు అసలు కనబడడు. అట్లని చంద్రుడు మాయం కాదు. ఆరోజు అతడు సూర్యునికి తోడుగా నడుస్తూ ఉంటాడు. పగలే సూర్యునితో ఉదయిస్తాడు, సూర్యునితో అస్తమిస్తాడు. సూర్యుని తీవ్ర ప్రకాశం ముందు అతడు కనబడటంలేదు అంతే. అమావాస్య రోజును మన ప్రాంతంవారు అశుభదినంగా పరిగణిస్తున్నారు కాని, కొన్ని ప్రాంతాలవారు దానిని గొప్ప సుదినంగా భావించి శుభకార్యాలు చేసుకుంటున్నారు. నిజంగా అది కూడా మంచిరోజే. ఎందుచేతనంటే ఆరోజు పగలు సూర్యప్రకాశంతోబాటు చంద్రప్రకాశం కూడా మన భూమిమీద పడుతుంది. దాని ప్రభావం స్థావర జంగమ ప్రాణులన్నిటి మీద పడుతుంది. మూలికా వైద్యులు కొన్ని మూలికలను ప్రత్యేకంగా ఆరోజే సేకరిస్తారు. కొన్ని జంతువులలోనూ ఈ మార్పు కనబడుతుంది. కొన్ని మానసిక శారీరక రోగాలు కొందరిలో ఆరోజు ఎక్కువ కావటం, కొందరిలో ఉపశమించటం జరుగుచున్నవని శాస్త్రజ్ఞులు గుర్తించారు. కనుక మన ఋషులు ఆరోజు దైనిక అగ్నిహోత్రంలో కొన్ని విశేష మంత్రాలతో ఆహుతులివ్వాలని నిర్దేశించారు.

**ఓం అగ్నయే స్వాహా ॥ - ఇదమగ్నయే - ఇదం న మమ.**
**ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా ॥ - ఇదమిన్ద్రాగ్నీభ్యామ్ - ఇదం న మమ.**
**ఓం విష్ణవే స్వాహా ॥ - ఇదం విష్ణవే - ఇదం న మమ.**
**ఓం భూరగ్నయే స్వాహా ॥ - ఇదమగ్నయే - ఇదం న మమ.**
**ఓం భువర్వాయవే స్వాహా ॥ - ఇదం వాయవే - ఇదం న మమ.**
**ఓం స్వరాదిత్యాయ స్వాహా ॥ - ఇదం మాదిత్యాయ - ఇదం న మమ.**
**ఓం భూర్ భువః స్వః అగ్ని వాయ్వాదితేభ్యః స్వాహా ॥**
**ఇద మగ్ని వాయ్వాదితేభ్యః - ఇదం న మమ.**

పై మంత్రాలలో రెండవ మంత్రం ఒక్కటే తేడాగా ఉంది. మిగిలిన మంత్రాలన్నీ 'పౌర్ణమాస్యేష్టి వలెనే ఉన్నాయి. రెండవ మంత్రంతో ఇంద్ర + అగ్నులకు ఆహుతి ఇస్తారు. ఇంద్రుడంటే 'విద్యుత్' అని అర్థం. అంటే సృష్టిలో ఉండే స్థిరవిద్యుత్.'

అమావాస్యనాటి రాత్రి ప్రాణులను కాపాడుతున్నదని కొందరంటారు. ఇంతవరకు మనం భౌతిక అమావాస్యను గురించి చెప్పుకున్నాము. ఇక అమావాస్య దేవుని గురించి తెలుసుకుందాము.

సర్వవ్యాపకుడు, సర్వేశ్వరుడు, సృష్టిస్థితిలయకర్తయైన ఏకేశ్వరునికే అమావాస్యుడని మరొక పేరు. 'అమా' అంటే 'తోడుగా' అని అర్థం. వాస్యుడు అంటే వసించేవాడు. రెండు పదములు కలిసి అమావాస్యుడు - తోడుగా ఉండేవాడని అయ్యింది. అయిన వారందరికన్న ఎక్కువగా తోడుగా ఉండేవాడు కనుక పరమేశ్వరుని అమావాస్యుడని అంటుంది వేదం. అమావాస్య రోజున చంద్రునికి సూర్యుడు తోడుగా ఉంటాడు కనుక అది భౌతిక అమావాస్య అయ్యింది. అందుచే ఆ రోజు ప్రాకృతిక దేవతలకిచ్చే ఆహుతులతోబాటు అమావాస్యాదేవునికి కూడా అథర్వవేదంలోని అమావాస్య సూక్తంతో ఆహుతులిస్తారు కొందరు.

ఆ మంత్రాలలో చక్కటి అర్థం ఉంటుంది. పరిశీలించండి.

**ఓం యత్ తే దేవా అకృణ్వన్ భాగధేయమమావాస్యే**
**సం వసన్తో మహిత్వా ।**
**తేనా నో యజ్ఞం పిపృహి విశ్వవారే రయిం నో**
**ధేహి సుభగే సువీరమ్ స్వాహా.**
**ఇదం అమావాస్యామై ఇదం న మమ.**

ఓ అమావాస్యుడా! సర్వకాల సర్వావస్థలయందు మాకు తోడుగా ఉండే ఓ సర్వవ్యాపక సర్వేశ్వరా! ఏవిధంగా

దేవతలు (దివ్యగుణాలు కలవారు) తమ తమ కర్తవ్య కర్మలను చక్కగా ఆచరిస్తారో, ఆవిధంగా మేమునూ వేదవిహిత పంచమహాయజ్ఞాది కర్తవ్య కర్మలను చేయుదుముగాక! ఓ విశ్వవారా! అందరిచేత కోరబడు ఓ పరమేశ్వరా! మాకు యజ్ఞములను (సత్కర్మలను) చక్కగా నెరవేర్చగల శక్తినిచ్చి వాటిని పూరింపుము. వాటి ఫలాలను ప్రసాదింపుము. ఓ సుభగా! పరమ సౌభాగ్యవంతుడా! మాకు సువీరులతో కూడిన ధనముల నిమ్ము.

**ఓం అహమేవాస్మ్యమావాస్యా3మామా వసన్తి సుకృతో మయీమే ।**
**మయి దేవా ఉభయే సాధ్యాశ్చేన్ద్ర జేష్ఠాః సమగచ్ఛన్తి సర్వే స్వాహా.**
**ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

అమావాస్య దేవుడు ఏమంటున్నాడంటే - ఓ మానవులారా! నేనే మీకు సదా తోడుగా ఉండే అమావాస్యుడను. నాయందే సుకృతులు సుఖాల ననుభవిస్తూ వసిస్తారు. ఉభయరకాల స్థావర జంగమ ప్రాణులునూ వాటి వాటి కర్మఫలాల ననుభవిస్తూ నాయందే వసించుచున్నవి.

**ఓం ఆగన్రాత్రీ సంగమనీ వసూనామూర్జం పుష్టం వస్వా వేశయన్తీ ।**
**అమావాస్యాయై హవిషా విధేమోర్జం దుహానా పయసా న ఆగన్ స్వాహా. ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

ఓ పరమేశ్వరా! నిన్ను ధ్యానిస్తూ నీ సంయోగం చేయు రాత్రి వచ్చినది. కనుక ఈరోజు మేము విధేయతతో సత్కర్మలచే హవిస్సులను అర్పింతుముగాక! నీవు జ్ఞానంతో కూడిన పరాక్రమాన్ని ప్రసాదించి మమ్ము తృప్తి పరుచుము.

**ఓం అమావాస్యే న త్వదేతాన్యన్యో విశ్వరూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం స్వాహా. ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

- అథర్వవేదం

ఓ అమావాస్యుడా! ఈ నామ రూపాత్మక జగత్తునంతటిని ఉత్పన్నముచేసి, అన్నివైపులనుండి కప్పుచు అన్నిటినీ నీ ఒడిలో కలిగియున్న వేరొక దేవుడు లేనేలేడు. కనుక మేము కేవలం నిన్నే ఉపాసింతుము గాక. మేము ఏ ఏ కోరికతలతో పూర్ణ పురుషార్థం చేయుదుమో వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. నీ కృపవలన మేము అన్నిరకాల ధనాలకు - ఐశ్వర్యాలకు పతుల మగుదుము గాక - స్వాముల మగుదుము గాక!

పై మంత్రాలతో అగ్నిహోత్రంలో ఆహుతులిచ్చేటప్పుడు మంత్రాల చివర "స్వాహా" కారం పలకాలి. అనంతరం "ఇదం అమావాస్యాయై ఇదం న మమ" అనే వాక్యాన్ని ఉచ్చరించాలి. అస్తు - మనం అట్లే చేయుదముగాక!

**విశేషాహుతుల మంత్రములు**

బృహద్ యజ్ఞానంతరం పై అమావాస్యేష్టి మంత్రాలతో ఆహుతులిస్తే సరిపోతుంది. ఎక్కువ ఆహుతులివ్వగోరేవారు అథర్వ వేదీయ శాంతిసూక్తంతోను, గాయత్రీ మంత్రంతోను ఆహుతులివ్వవచ్చు.

శుభమస్తు